## 'నివేదిత' — అంటే, నివేదించబడినది !



"కన్న తల్లి మనసూ ....
మహాయోధుని దృఢ సంకల్పమూ,
మలయ మారుతంలోని లాలీ,
దేవుని గుడిలోని దీపాల ఆరని జ్యోతి,
పవిత్ర వేదమంత్రాల లోని బలం, అన్నీ
.. ఈ అన్నీ .. నీవిగా" – "ఇదే నా ఆశీస్సులు"

– స్వామి వివేకానంద

# నివేదిత

డా. వేదవ్యాస, IAS, Ph.D

భారతస్త్రీగా పవిత్ర పూజా పుష్పంగా జీవించాలని కలలు
గన్న అమెరికన్ - సన్యాసిని - అమరగాథ!
శ్రీ వేదవ్యాస గురుదేవుల - వేడి కలం నుండి వెలువడ్డ
వాడి సందేశం !! మహిళా లోకానికి
భారతదేశం యిచ్చే భగవద్గీత - ఇదే !



చిత్రం : 1893లో వివేకానందులు ప్రసంగించిన చికాగో - సర్వమతాల మహాసభ. మళ్ళీ నూరేళ్ళకు ప్రసంగించిన 1993లో వేదవ్యాస. ఎందరు నివేదితలున్నారు మనలో ! అందులో మీరూ ఉన్నారా ? బూడిదను వూది తొలగించితే వెలిగే నిప్పురవ్వలా వున్నారా ? మీకే ఈ గ్రంథం ! - కట్నాల దహనాల, గృహ కటకటాలలో కలియుగ రాక్షసుల కోరలతోమే - నిర్మల పూజా పుష్పాల కోసం వీచే నిర్మల మలయ మారుతం !

# నివేదిత

డా॥ వేదవ్యాస Ph.D

వేదవ్యాస భారతి - వేద విశ్వవిద్యాలయం

దుద్దుకూరు - శ్రీపర్వతం - పశ్చిమగోదావరిజిల్లా

1995

Rs 20=00

ద్వితీయ ముద్రణ : 1995



కాపీలకు

| | |
|---|---|
| సెక్రటరీ, యోగమిత్రమండలి<br>షాప్ నెం. 58<br>చందనా కాంప్లెక్స్, తాడితోట,<br>రాజమండ్రి - 533 103 | సెక్రటరీ, యోగమిత్రమండలి,<br>రోడ్ నెం. 8, ఫ్లాట్ నెం. 56,<br>జూబ్లీహిల్స్,<br>హైదరాబాదు - 500 003 |

# నివేదిత

## విషయసూచిక

# నివేదిత

'నివేదిత' అంటే - ''భగవంతునికి నివేదించబడినది (లేక సమర్పింపబడినది)'' అని

''నివేదిత''-! ఎంత చక్కగా సరిపోతున్నది ఈ పేరు ! ఈమె యొక్క పవిత్రజీవితాన్ని సరిగ్గా వర్ణించడానికి ఆశ్చర్యమేస్తుంది! ఎవరీ నివేదిత ? ఎందుకీమె పేరు విన్నవెంటనే మనస్సు ఇంత తియ్యగా అయిపోతున్నది ? ఈమెను తలచుకుంటేనే ఈమె ఎవరో తెలియకపోయినా సరే, గుండెలు ద్రవించి కన్నులు తడిగా అవుతున్నాయి?

మనలో చాలా మందికి 'సోదరి నివేదిత' అంటే ఏమిటో, ఆ

జీవితంలో ఎంత ఆత్మార్పణ, త్యాగం, ఆపేక్షా గూడుకట్టుకున్నాయో తెలియదు. అలాంటివాళ్ళే ఆ సమాధి మీద చెక్కబడివున్న ఈ పేరును చదవి ఆశ్చర్యపోతున్న వాళ్ళు ! ''నివేదిత''

అవును! మీరు 'డార్జిలింగ్' రైల్వేస్టేషనులో దిగగానే దూరాన కనిపించే ఆ బయలు స్మశానమనీ, దానిలో నిర్మలంగా, ఏకాకిగా ఇటుకలతో కట్టబడిన, ఆ చిన్న స్మారకచిహ్నం సోదరి నివేదిత ఆఖరి విశ్రాంతి స్థలం అని' ఇక్కడే ఆమె ప్రేమించిన భారతదేశంమట్టిలో కలిసిపోయి — ఈ మట్టిని పునీతం చేసిన నివేదిత జీవితంలోని చివరి నివేదన జరిగిందీ సమాధి వద్దనే, అని మనలో చాలా మందికి తెలియదు.

అప్పటికింకా మార్గరెట్ ఎలిజబెత్ నోబుల్ నివేదితగా మారలేదు. ఆమె జీవితంలో తన జన్మ మార్చుకొన్న ఆరోజు - ఈమె జీవితాన్నే మార్చివేసిన శుభ ఘడియ - స్వామి వివేకానందులను కలుసుకున్న రోజే ? స్వామి లండన్‌లో అమెరికా, ఫ్రాన్సుదేశాలలో ఆయన పర్యటించి యూరపులో ఒక 'సుడిగుడం' సృష్టిస్తున్న రోజులవి. మేధావులందరిలోనూ ఒక గొప్ప చైతన్యం రాసాగింది ఎవరిని చూసినా హిందూమతం, అద్వైతం, యోగము గురించి కంచుగంట వంటి కంఠముతో, రాజఠీవితో, దబ్బపండువంటి ఛాయతో, వెడల్పాటి తామర రేకులవంటి కళ్ళతో, ప్రేమను బంధించే చిలిపినవ్వుతో, వంగపండు రంగు పట్టు తలపాగాతో కదులుతూవుండే వివేకానందుడి గురించే



కబుర్లు! అందరి మొహాలలోను ఆసక్తి! ఎవరీయన ? 'హిందూ యోగి' అని మాత్రం చెప్పారు. ఆ పదహారు మందికి ఆరోజు !

అది ఆదివారం రోజు. చలిగా మబ్బుగావున్నా ఆసక్తితో ఆ చిన్ని గుంపు 'లేడీ' ఇసబెల్ ఇంటిలో సమావేశమయి ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. వివేకానందస్వామి ఎపుడు బయటికి వస్తారా చూద్దామని. అందులో ఎలిజబెత్ మార్గరెట్ కూడా ఒకతె! మార్గరెట్‌కు వేదాంతం అన్నా మతం అన్నా వున్న ఆసక్తి తెలిసి లేడీ ఇనబెల్ తన యింటికి ఆహ్వానించింది ఆ చిన్న బృందంలోకి. ఆరోజునే ఆరంభమైంది మార్గరెట్‌కు కొత్త జీవితం. కాని ఆమెకు తెలియడానికి కొంతకాలం పట్టింది.

వెలిగే చలిమంట వెలుతురులో బంగారుగా వెలుగుతున్న ఆ కాంతిలో స్వామి ముఖం ఇంకా తేజోవంతంగా వెలుగుతోంది. మెరుస్తున్న కాషాయాలు ధరించి ఆయన చిరునవ్వుతో వాళ్ళ మధ్యకు వచ్చారు. ఆయనెంత గంభీర మధురమూర్తి! అందరూ నేలమీద అర్ధచంద్రాకారంలో కూర్చున్నారు స్వామి పాదాలకు నమస్కరించి! ఆ రోజులలో స్వామి వివేకానందులు యూరపు పర్యటన చేస్తున్నారు. హిందూమతం గురించి ఉపన్యాసాలిస్తూ ఎక్కువగా శ్రద్ధ ఆసక్తి కలవాళ్ళకి క్లాసులుపెట్టి అనేక విషయాలు నేర్పారాయన. ఆరోజు మొదలు మార్గరెట్ నోబుల్‌గా వున్న 'నివేదిత' ఒక్క లెక్చరుగాని, క్లాసుగాని వదలలేదు. అనేక విషయాలు విన్నది, నేర్చుకున్నది. అనేకసార్లు

ఆయనతో వాదించింది : ఒకొక్కసారి తర్కించేది! అన్నింటికీ చిరునవ్వుతోనే స్వామి బదులు చెప్పేవారు ఆయన సమాధానాల కన్నా ఆయన ప్రేమ, ఆయనలోని నిర్మలత్వం, స్వార్థంగాని, వ్యక్తిగత జీవితంమీదగాని ధ్యాస లేకపోవటం, పసిపిల్లవాని మనస్తత్వంలో రంగరించిన మహాఋషి యొక్క యోగదీక్ష, జ్ఞానం — ఈ అద్భుత మేళవింపు నివేదిత జీవితాన్ని తెలియకుండానే మార్చివేయసాగాయి.

ఒకవిధంగా చూస్తే 'నివేదిత' జీవితం భగవత్ నివేదన కోసమే నిర్దేశించబడిందా అని తోస్తుంది. 'మిస్ మార్గరెట్ నోబుల్' టీచరుగా పని చేస్తోంది! అంతకు ముందు పదేళ్ళుగా విద్యావిధానం గురించి, మతం గురించి మానవునికి నిజమైన జ్ఞానం గురించి స్వతంత్ర భావాలు చిగురిస్తున్న తరుణం అది. ఊహాలోకాలలో విహరించే గాఢమైన నీలం కళ్ళు, బంగారురంగు జుట్టు బక్కపల్చని దృఢమైన ఆకారం, ఆకర్షణ, పట్టుదల, గర్వం, ఠీవి ఉట్టిపడే మిస్ నోబుల్‌కు నిండా ముప్పై ఏళ్ళు కూడా లేవు ఆ నాటికి.

## ఓ పువ్వు పూసింది !

సోదరి నివేదిత అక్టోబరు 28వ తేదీ 1867న ఇంగ్లండులో జన్మించింది ''నోబుల్''ల కుటుంబంలో. తాతగారు జాన్ నోబుల్ ఉత్తర ఇంగ్లండు లోని 'వెస్లీ చర్చి'లో మతగురువు. ఇంగ్లండులో అయిదు శతాబ్దాలుగా స్థిరపడిన స్కాటిస్ కుటుంబం వీరిది! వారి



కుమారుడైన సామ్యుయెల్ రిచ్‌మండ్‌కు కలిగిన పెద్దపిల్లగా మార్గరెట్ నోబుల్ ఒక మంచివంశంలో జన్మించింది. ఈమెకు 'మేరీ' అనే చెల్లెలూ, 'రిచ్‌మండ్' అనే తమ్ముడూ ఉన్నారు.

మార్గరెట్ చిన్నతనం తాతగారితోనే గడిచింది. బీదల యిళ్లకు పోవటం, ఆయన మతబోధ చేయటం అనేక మందికి నిస్వార్థసేవ చేయటం అంటే సరదాగా వుండేది. సేవ అంటే వారికి చదువు చెప్పటం, రోగం, బాధలు, లేమితో బాధపడుతూంటే వెళ్లి సేవచేసి, ఓదార్చి, సలహా, సహాయంతో బాటు దైవచింతన, భక్తి బోధించటం, తాతగారితో తిరుగుతూంటే అతి తెలివిగా అలవాటు అయిపోయింది. కాని తీవ్రమైన శ్రమ, నిరంతరం పని, ప్రార్థనా, తిరుగుడూ వీటితో విశ్రాంతి లేకపోవటంతో చిన్నవాడుగానే మరణించాడు తాతగారు. మార్గరెట్ 1876 వరకూ ఆయనతోనే వున్నది. తర్వాత తండ్రి సామ్యుయెల్ నోబుల్ తో బీదలకుసేవ, మతబోధ, ప్రార్థనలతోనే గడిచింది. ఒకనాడు తండ్రి తన స్నేహితుడైన ఒక ఫాదర్‌ని చూడటానికి వెళితే కూడా మార్గరెట్ వెళ్లింది. ఆయనెపుడో చిన్నపిల్లగా చూసిన మార్గరెట్‌ను ఎదిగినపిల్లగా చూసి ఆనందించాడు. దూరంగా చూస్తున్న నీలం కళ్ళతో, గడ్డంతో వున్న ఆ మతాచార్యుడు మార్గరెట్‌ని చూస్తూ, ''నువ్వు పెరిగి పెద్దదానవై చాలాపేరు తెచ్చుకుంటావు. నువ్వొకనాడు భారతదేశం వెళ్లవలసి వస్తుంది, అక్కడ అనేక మంది బీదలకూ, రోగులకు, దీనులకు సేవచేసి తరిస్తావు!'' అన్నాడు.

మార్గరెట్ ఆశ్చర్యపోయింది. చిన్నతనంలో వున్న ఆమెకదేమీ అర్థంకాలేదు. తర్వాత అదే నిజమైంది.

అప్పటికే జీవితంలో వెలుగుకోసం అన్వేషిస్తున్న మార్గరెట్‌కు స్వామి వివేకానందుని దర్శనం ఒక నూతన అధ్యాయాన్ని ఆరంభించింది. అప్పటికే బైబిలులో వున్న మతం తనలో పెరుగుతున్న ఆధ్యాత్మిక వికాసం శాంతింపచేయలేదని కనిపెట్టిన ''మార్గరెట్''కు స్వామియొక్క యోగాభ్యాసం, పవిత్రజీవితం, ప్రతినిత్యం ధ్యానం చేయడం, జనసేవ, చూడగానే తన జీవితానికొక అర్థం చూపించినట్టయింది. ఆయన ఉపన్యాసం ఒక్కటికూడ వదలి పెట్టకుండా శ్రద్ధగా వినసాగింది. గంభీరమైన ఆయన కంఠస్వరంలో సంధ్యాసమయంలో పాడే భక్తికీర్తనలు గంభీరమైన స్వామి కంఠంలో ఘంటానాదంలా ప్రతిధ్వనిస్తూ ఉంటే మార్గరెట్ మనస్సు, శరీరం, ఆమె జీవితమే ఒక స్పందనలో చిగురింపసాగింది.

మనుషుల్లో ఒక దేవునివలే వున్న ఈయన ఎక్కడో దూరతీరాల నుంచి భారతదేశం నుంచి వచ్చి మానవ జాతికి, మానవాళికి అహర్నిశలూ శ్రమించి చేస్తున్న సేవ తన జీవితానికొక మార్గదర్శి లాగా ఏర్పరచుకొన్నది. ఆమె దృష్టిలో ఆయన ఒక మహావ్యక్తి, మనుషుల్లోని స్వార్థం, మూర్ఖత్వం, అజ్ఞానం వల్లనే మానవజాతికి, ఇంతవరకు కలిగిన కష్టాలను కల్పిస్తున్నాయి. ఈ ప్రపంచం మారాలంటే ఈ మూడింటితో పోరాటం సాగించాలి. ఈ పోరాటంలో ఒక్కటే ఆయుధం భగవంతునిపై విశ్వాసం. ప్రపంచం ధాటికి ఒకటే కవచం, అది నిస్వార్థ సేవ అంతులేని ప్రేమ వాటితోనే అమర జీవిత సమరం నడుస్తూ వుండటం గమనించింది. చరిత్రనే మార్పుచేసే ఈ మహత్తర ఉద్యమాన్ని ఊరికే చూస్తూ చేతులు కట్టుకొని కూర్చొనడం స్వార్థమనిపించింది మార్గరెట్‌కు. ఆయనపడే నిరంతరశ్రమ చూస్తూ విశ్రాంతిగా కూర్చోవడం అన్యాయంగా తోచవచ్చు. ఆ రోజున అనేక విషయాలమీద మాట్లాడారు స్వామి. . చివరికి ''ఈనాడు ప్రపంచంలో నాక్కావలసింది కనీసం 20 మంది యువతీ యువకులు ధైర్యస్తులు, స్థిరంగా నిలబడ గలిగిన వాళ్ళు కావాలి. అవసరమైతే నడిబజార్లో నిలబడి తనకున్నవన్నీ పరిత్యజించి, ఒక్కధోవతులు తప్ప మరేమి లేకుండా నిలబడి పోరాటం సాగించాలి! ఉన్నారా అలాంటి వాళ్ళు?''.

స్వామి మాటలు మార్గరెట్ హృదయంలో బాణంలా గుచ్చుకొన్నవి. అదే విషయం ఆయన ఆమెకు తరువాత రాసిన ఉత్తరాలలో పదేపదేనొక్కి చెపుతున్నది. ఈనాటి ప్రపంచం పరిస్థితిలో మానవజాతి భయంకర విషవలయంలో చిక్కుకున్నది. ఇపుడు కావలసినది మనుషుల్లో కల్లా ఉత్తములు, ఎంత త్యాగమైనా వెనుదీయని మంచివారు, దృఢసంకల్పంతో పనిచేసేవారు కావాలి! నిరంతరం ప్రేమతో కరిగిపోయే ఉద్యమ స్వరూపులు మానవజాతి కోసం కష్టించాల్సి వచ్చిన తరుణం వచ్చింది.

ఇంకోరోజు స్వామి తన దేశపు స్త్రీల గురించి ఎన్నో చెప్పారు.

''భారతస్త్రీలలో సహనం, నిస్వార్థత, ప్రేమ యొక్క మూర్తులుగా ఆధ్యాత్మిక జ్యోతులుగా, వారు హిందూధర్మానికి వెలిగించిన దీపం ఎలాంటిదో వివరించారు. కాని ఈనాటి స్త్రీలకు సరైన విద్య చెప్పే స్కూలులేదు. ఒకనాటి మహోన్నత ఆదర్శాలను, స్త్రీత్వంలోని పవిత్రతను, ఆధ్యాత్మికశక్తినీ, సాధన ద్వారా నేర్పే విద్యాప్రణాళిక కావాలి''. అని అకస్మాత్తుగా మార్గరెట్ వైపు తిరిగి ''నా దేశంలోని స్త్రీలకు ఒక పెద్ద కార్యక్రమం చేపట్టాను. ఇది ఎంతో బాధ్యతలు, శ్రమలతో కూడిన కార్యక్రమం. బహుశ అందులో నీ సేవా సమయం అవసరమవుతాయి, అనుకుంటున్నాను'' అన్నారు. ఎన్నాళ్ళనుంచో వెతుకుతున్న పిలుపు తన జీవితంలో వినిపించిందా మాటల్లో మార్గరెట్‌కు. అది కేవలం అభినేసం కాదు. తన ఆత్మకు ఉన్న పిలుపు. తక్షణం నిర్ణయించుకుంది స్వామి యొక్క ఆధ్యాత్మిక సేవలలో తాను ఒక పాత్ర నిర్వహించాలని. ఆయనచేసే మహత్తరకార్యంలో తాను తన సేవగా తన జీవితాన్నే అర్పించాలనుకొన్నది. ఇది అంతతేలికైయిన నిర్ణయం కాదు! భారతదేశం ఎలా వుంటుందో కూడా తను ఎరుగదు. దూరప్రయాణం, తనవద్ద డబ్బుకూడా లేదు. తన బంధువులను, ఇతరులను అందరిని విడిచిపెట్టాలి. ప్రతిఫలం తనకు త్యాగం, ఆత్మసమర్పణ తప్ప మరేమీ ఉండదు. అయినా సరే తన కందిన పిలుపుకు వెనకాడదలచ లేదు.

ఫలితంగా లండను ఒక ఉత్తమ టీచరును కోల్పోయింది. కాని



భారతదేశం శాశ్వతంగా ఒక రత్నంలాంటి నివేదితను సంపాదించుకొన్నది. ఆనాటినుంచి భారతదేశమే తనదేశం, భారత ప్రజలే తన బంధువులు, భారత స్త్రీలే తన అక్క చెల్లెళ్ళుగా మారిపోయింది నివేదిత జీవితం. స్వామి వివేకానందుడితో పాటు 1918 డిశంబరు 16న బయలుదేరి భారతదేశం వచ్చింది. ఆశ, పట్టుదల, ఆదర్శం తప్ప అనుభవంలేని అమాయకత్వంతో ధైర్యంగా ముందడుగు పెట్టింది.

భారతదేశంలో విపరీతమైన వేడి! వాతావరణం మార్పు! ఈ మండుటెండలకు, వర్షాలకు తట్టుకొని నిలవగలదా! తిండిమార్పు, నీళ్లమార్పు, ముక్కుమొహం తెలియని క్రొత్త మనుషులు, భాష కాని భాష, ఇక్కడ మనుషులతో ఎలా మెలగాలో వారి కట్టుబాట్లు ఎలాంటివో తెలియదు నివేదితకు! అలాంటి దేశంలో పనిచేయాలి. పైగా తెల్లజాతికి చెందిన యూరోపియన్లంతా భారతీయులతో కలసి పనిచేస్తే తనను నీచంగా, తక్కువగా చూస్తారు. ఈ ద్వేషాన్ని ఎదుర్కొనగలదా తను? అంతేకాదు తను ఏ భారతీయుల కోసం పని చేస్తోందో వాళ్లు కూడా తనను నమ్మగలరా? వాళ్ల విశ్వాసం, ఆదరణ లేకుండా పని చేయగలదా?

''నీ పక్కన నేనున్నాను! ఎట్టి పరిస్థితిలోనూ నీకండగా ఉంటాను. ఇది నాహామీ! నీవు భారతదేశానికి పనిచేసినా సరే, లేకపోయినా సరే, నువ్వు నేనుపదేశించిన వేదాంతాన్ని అనుసరించినా సరే, పరిత్యజించినా సరే; నా సహాయం మరణించే వరకు నీతోనే

ఉంటుంది!'' అని స్వామి వివేకానందుడు నివేదితకు ఇచ్చిన అభయం, ఆసరా తనకి వెయ్యి ఏనుగుల బలం యిచ్చింది తాను నమ్మిన గురుదేవుల కోసం, తన జీవితాన్ని యావత్తు ధారపోయాలని నిశ్చయించుకుంది. అది ఒక తిరుగులేని నిర్ణయం! అది నిర్ణయం మాత్రమేకాదు, ఒక నివేదన, పూజాభావంతో చేయబడిందే! అది ఒక పట్టుదలతో కూడిన నిశ్చయం మాత్రమే కాదు. అది ప్రేమతో చేయబడిన ఆత్మసమర్పణ. అది ప్రతిఫలం కోరే ప్రేమ కాదు. ఆత్మార్పణ చేసుకొనే త్యాగం. అందుకే ఆమె నివేదిత !

అది 1898 సంవత్సరము జనవరి 28వ తేదీ! కలకత్తా సమీపిస్తున్న స్టీమరులో భారతదేశం చేరుకున్నది నివేదిత. ఆకాశం మంచుతో విపరీతమైన చలిగా తన భవిష్యత్తులాగా స్పష్టంగా వస్తువు లేవీ కనిపించకుండా పట్టిన పొగమంచు, స్టీమరువద్ద వేలాదిమంది భారతీయుల ముఖాలను ఆత్రుతతో కలయచూసింది. అందులో ఒకే ఒక వ్యక్తి తప్ప తక్కిన అందరూ క్రొత్తవాళ్లే ! స్వామీ వివేకానందుడు స్వయంగా స్టీమరు వద్దకు వచ్చి నివేదితకు స్వాగతం పలికారు. ఆమె హృదయం ఆనందంతో నిండిపోయింది. ఆనాటినుండి భారతదేశం ఆమె సొంతయిల్లు. బాల్య బృందావనం వార్ధక వారణాసి. భారతదేశం కోసం శ్రమించి, భారతదేశపు మట్టిలోనే కలిసిపోవాలని ఆమె అడుగుపెట్టిందీ పవిత్రభారత భూమిపైన.

కలకత్తాలో కొద్దిరోజులు తోటి యూరోపియన్లతో కారుమీద



ఊరు చూడ్డానికి వెళ్లింది. కానీ ఎక్కడ చూచినా యూరోపియన్ల ఇళ్లకే వెళ్లడం ఆమెకు రుచించలేదు. మర్నాడే స్వామి శిష్యులైన 'సారాబుల్' తోను 'జోసిఫీన్' మెక్లీయోడే తోనుకలసి బీదవాళ్లు, హిందువులు నివసించే స్థలానికి మారింది కొద్ది రోజుల తర్వాత బేలూరు మఠం దగ్గర గంగ ఒడ్డున ఉన్న పూరిఇళ్లలోకి వెళ్లింది. అందులోనే సాధన చేసుకుంటూ భిక్షచేసి జీవిస్తున్న రామకృష్ణ మఠసన్యాసులు చేస్తున్న సేవా కార్యక్రమంలో తాను చేరుకుంది. ఏ సౌకర్యాలు లేని కఠినమైన జీవితం అయితేనేమి?.....ప్రతిరోజు స్వామి ఆ కుటీరానికి వచ్చి తాను చేయవలసిన భవిష్యత్కార్యక్రమం గురించి, ఆదర్శాల గురించి బోధించేవాడు. నివేదిత చేయవలసిన కార్యక్రమంలో ముఖ్యభాగం ఆమె సేవింపదలచిన భారతీయులను కలుసుకోవాలి! అందుకోసం మార్చి 11న కలకత్తాలో ఒక పెద్ద భారతీయసభ ఏర్పాటుచేసి స్వామి ఆమె గురించి పరిచయ వాక్యాలు పలికారు. భారతదేశానికి ఇంగ్లండు అనేకమంది మేధావులను గతంలో పంపిఉన్నది. అక్కడి ప్రజలు ఈసారి మిస్‌మార్గరెట్ నోబుల్‌ను భారతీయులకు కానుకగా పంపారు. నివేదిత తన ఉపన్యాసంలో ఇంగ్లండుపైన భారతదేశం యొక్క ఆధ్యాత్మిక ప్రభావాన్ని గురించి ప్రస్తావించింది.

తరువాతి సంఘటన ఆమె జీవితాన్నే వెలిగించింది. ఆ రోజు మార్చి 17. భారతీయులందరూ జగన్మాతగా పూజించే శారదామణి దర్శనం నివేదితను ద్రవింపచేసింది. ఆమె తన డైరీలో తన జీవితానికే

ముఖ్యమైన రోజు అని వ్రాసుకుంది. శ్రీ రామకృష్ణ పరమహంస వంటి మహానీయుని యిల్లాలుగా పూజనందుకొన్న దేవతామూర్తిగా జీవించిన ఆ అద్భుత మాతృమూర్తిని చూడాలని నివేదిత గుండెలు కొట్టుకోసాగాయి. చూడగానే శారదామాత నివేదితను ఆపేక్షగా పలకరించి, ఈమె నాకూతురు అంటూ చేరదీసింది. ఆ ఆత్మీయత, ఆ ప్రేమ నివేదితను కదిలించివేశాయి. ''ఆమె ప్రేమ మధురాతి మధురం. అంతటి సరళ హృదయును, అమృతమూర్తిని, అనురాగమూర్తిని త్యాగస్వరూపిణిని జీవితంలో మరెక్కడా చూడం'' అంటూ తన డైరీలో నివేదిత వ్రాసుకున్నది. 'మార్గరెట్' ఆనాడు వ్రాసిన ఆమె డైరీవల్లనే ఈనాడు మనం అనేక విషయాలు తెలుసుకోగలుగుతున్నాం. ఆమె డైరీయే గనక వ్రాయలేక పోయివున్నట్టయితే ఎన్నో అపూర్వమైన సంఘటనలు. స్వామి జీవితంలోని, ఆమె జీవితంలోని అమృతపు చినుకులవంటి సన్నివేశాలు కాలగర్భంలో కలిసిపోయివుండేవి! అందుకే మనం నివేదిత సోదరికి, ఆమె డైరీలకు ఎంతో ఋణపడి వున్నాము.

మార్చి 25వ తేదీన ఇంకొక మలుపుతిరిగింది ఆమె జీవితం. అది అమెకెంతో పుణ్యమైనదినం! ఆనాడే తన పూజ్య గురుదేవుడు స్వామి వివేకానందుడు మిస్ మార్గరెట్ నోబుల్‌ను - ''నివేదిత''గా పేరు మార్చి భగవంతునికి ఆమెను నైవేద్యంగా సమర్పించిన నివేదన జరిగిందా రోజున! ఆరోజామెకు మరపురానిది! తను జన్మించిన 30 ఏళ్ళకు



తన దేవుడు తన జీవితాన్ని నివేదనగా స్వీకరించాడు! కాషాయాంబరాలు, జపమాల, ఏకాంతవాసం, నిత్యసేవ యివే ఆనాటి నుంచీ స్వామి వివేకానందులామెకు ప్రసాదించినవవి. పుట్టినప్పుడే భగవత్సేవకు, భారతదేశానికి అంకితమైన నివేదిత ఆనాటినుంచీ నిజంగానే నివేదితగా రూపొందింది! ఆనాటినుంచీ ఆవిడ జీవితం ఒక బంగారుబాట! వెలుగుబాట!

ప్రతినిత్యం ప్రొద్దున్నే లేవటం స్నానపూజాదులైంతరువాత ఒక గంటకుపైగా ధ్యానం; భిక్ష, మానవసేవ, ఆ తర్వాత భోజనం తర్వాత స్వామిచెప్పే ఉపదేశాలు వినటం!! ఇది తక్కిన సన్యాసులతో కలిసి రామకృష్ణమఠంలోని ఆమె దినచర్య. కాలం శరవేగంలా జరుగుతున్నది.

ఓసారి వేసవిలో హిమాలయాలకు యాత్రవెళ్ళటం జరిగింది. స్వామితో ఆల్మోరాలోని హిమాలయ శిఖరాలు చూస్తూ రంగు రంగుల పూలు, దేవదారు అడవులు, మంచులోయలు, బంగారు నీరెండ తగిలి మెరిసే హిమశిఖరాలు, స్వామి ఉపన్యాసాలు చెవులకు, కన్నులకు విందుగా గడిచాయి రోజులు నివేదితకు. కాని కాలం శరవేగంతో పరుగిడిపోతున్నది. ఆనందంలో ఆమె ఆశయాలు ఉన్నత శిఖరాలపై తేలియాడు తున్నాయి, ఆదర్శంగా నడుస్తోంది. తన జీవితం ఏనాడు ఊహించని రీతిగా! అలానే అమర్‌నాథ్‌లోని మంచులింగం రూపంలోనున్న శివదర్శనం చేసుకున్నది వివేకానందులతో కలసి! ఆ అనుభూతి అపూర్వం! అని తన డైరీలో రాసింది నివేదిత ''నేనే

గడిచిన రోజులను వెనక్కి తిరిగి నెమరువేసుకుంటే నాకే నమ్మశక్యం కాకుండా వున్నది. నేనేనా ఈ అందరాని మహోన్నత శిఖరాలను జీవితంలో అనుభవిస్తోంది! అని ఆ పవిత్ర వాతావరణంలో స్వామి ఉండుండి ''శివా! శివా!'' అని తనలోతానే గట్టిగా అనుకుంటున్నట్టుగా అనేవారు. జగత్తుకు ప్రభువు అమరనాధుడై స్వయంగా లింగరూపంలో కళ్ళఎదుట కనిపిస్తూంటే ఆ ఆనందాన్ని కడుపునిండా గ్రోలి మత్తులో మునిగినట్టు ధ్యానంలో ఉండేవారు స్వామి వివేకానందులు. ఈ రెండూ నివేదిత యాత్రను రెండు విధాలుగా పునీతం చేసినాయి! ఒకటి దేవుని యాత్ర! రెండవది గురుదేవులతోడి జీవితమే ఒక పవిత్ర తీర్థయాత్ర! ఈ రెండు కలిసిరావటం అదృష్టం'' అంటుంది నివేదిత.

''మేమీ ఉన్నత శిఖరాలలో జీవిస్తూ ప్రతిశ్వాసతోను ఒక నిత్యమైన పవిత్ర ఆధ్యాత్మిక సత్యాన్ని అనుభవిస్తున్నాము! అన్ని గొప్ప మతాలకు సారమైనసత్యంగా నిలచిన ఆధ్యాత్మికానుభూతిని చేతులతో జుర్రుకున్నాము. ఆ వాతావరణంలో దేవుడు మాకు సామాన్య మానవుడికన్నా సామాన్యంగా అనుభూతికి అందే సహజవస్తువైనాడు'' స్వామి వివేకానందుని పవిత్రధ్యానం, నిత్య శివసాన్నిధ్యంలోని ప్రభావం అటువంటివి!

ఈ తీర్థయాత్రలో శ్రీ వివేకానందస్వామి జీవితంలో ఒక పరాకాష్ఠను చేరుకున్న పతాక సన్నివేశం ఆరంభమైనది. కన్నులారా స్వామియొక్క ధ్యానతీవ్రతను, వైరాగ్య తీక్షణతను, ఆయన హృదయాన్ని బద్దలుకొట్టుకొని పొంగిప్రవహించే భక్తిని కన్నులారా చూసింది. స్వామితో సన్నిహితంగా ప్రయాణించి సేవలు అందించిన నివేదిత! అమెరికాలోని ఉపన్యాసాలు యిచ్చిన వివేకానందుడు కాడు ఈ స్వామి! సాక్షాత్తూ శివునితో సాన్నిధ్యాన్ని, అభేదత్వాన్ని ఆస్వాదించే నిర్వికల్ప సమాధిలో మునిగి వుండే మునిపుంగవుడే ఈ వివేకానందుడు. స్వామిలోని ఆధ్యాత్మికత ఏదో ఒక అలౌకికంగా వెలగటం నివేదిత గమనించింది. ఈ అనుభూతి నివేదిత ఆధ్యాత్మిక జీవితంపై చెరగని ముద్ర వేయటం జరిగింది. అంతే గాక ఆమెను తీవ్రవైరాగ్యం వైపు బలంగా ఆకర్షించసాగింది ఆ అనుభూతి. ఆహా! మహాత్ముల తోటి సాంగత్యం భగవంతునిసన్నిధి వంటిది గదా!



తన గురుదేవుడిచ్చిన 'నివేదిత' పేరుతో కొత్తజీవితం ఆరంభమైంది. ఈ జీవితం నిజంగా 'కొత్త' ఏమీ కాదు. ఇన్నేళ్ళుగా ఎదురు చూస్తున్నదే-ఇన్నాళ్ళకు ప్రత్యక్షంగా స్థిరపడింది.

శ్రీ శారదామాత దర్శనంలోనే ఆమె హృదయాన్ని ఆకట్టుకున్నది నివేదితకు ఆమె జీవితంలో సాధన నిజంగా ఇప్పుడే ప్రారంభం అయింది. తెల్లవారకముందే లేవటం, గంగకు వెళ్ళి తలస్నానం చేసి ఉదయిస్తున్న సూర్యుడికి ప్రాతఃకాల పూజా పుష్పాంజలినిచ్చి తిరిగి వస్తూ, శారదామాతను వెళ్ళి చుట్టేసుకొనేది స్వంత తల్లిలా! అతి సహజంగా అల్లుకు పోయినాయి ఆ ఇద్దరి హృదయాలూ తన స్కూలు ప్రారంభించినప్పటి నుంచీ! అదే తన గురుదేవునికి సమర్పించే

నిస్వార్థసేవా పూజ! తర్వాత మధ్యాహ్నం పండ్లూ, పాలు, ఆహారం!! ఆ తర్వాత నిత్యం ''భగవద్గీత'' పారాయణ చేస్తూ రోజూ ఒక్కొక్క అధ్యాయం అర్థాలతో క్షుణ్ణంగా పరిశోధనచేస్తూ చదువూ!

కాని అన్నింటికన్న నివేదిత హృదయాన్ని ఆకర్షించింది ధ్యానం. నిరంతరం ఆమె పద్మాసనంలో కూర్చుని తన మనస్సును ఆత్మపై కేంద్రీకరించి ధ్యానించే సమయంలో లభించేవి మలయమారుతంలాగ చల్లగా ప్రశాంతంగా తగిలే భాగవత్‌శక్తి తరంగాలు! గురుదేవుని కృపకూ దేవుని దయకూ పాత్రమైన 'నివేదిత' జీవితంలో ధ్యానంలో అనుగ్రహానికేం లోటు వుంటుంది? తన సందేహాలకు సమాధానాలుగా స్వామి అందరికీ క్లాసులో చెప్పే ప్రవచనం వింటూవుంటే ఆ సందేహాలు తొలగిపోయేవి.

కాని ధ్యానంలో నివేదితకు అనుకున్నంత త్వరగా తను భగవత్సాక్షాత్కార 'గమ్యం' చేరుకోలేదని తహ తహ ఎక్కువ కాసాగింది. తనని వెనక్కిలాగి పట్టివుంచుతున్న అభ్యంతరం ఏమిటి? ఆత్మ పరిశీలనయే గురుదేవుడు తనకి చూపించిన మార్గం! నిశితంగా 'తన' లోకి తాను మనస్సుతోనే గుచ్చి గుచ్చి చూసుకునేది ! తన ఆలోచనలే అంతరాయాలా? అయితే తను నిత్యం చేసే ధ్యాన తీవ్రతకు అవి కరిగిపోవా? తన గురుదేవుని అనుగ్రహశక్తి ముందు అవి ఎండముందు పొగమంచులా అదృశ్యం కావాలి కదా? నివేదిత నిత్యం తనలోకి పరిశీలించగా-నిష్పక్షపాత దృష్టితో చూస్తే



కనిపించింది-తనబాటకి అడ్డుగావున్నది 'తానే'నని! ఇదేమిటీ చిత్రం? అవును తనలో ఒక 'తను' ధ్యానంచేస్తూ తీవ్రతతో ముందుకు పోదామని యత్నిస్తున్నది, కాని ఇంకోతాను అడ్డుగా నిలుస్తోంది. ఇది తను చిన్నతనంనుంచీ పెంచుకున్న మంకుపట్టుదల, అహంకారం, ఆత్మాభిమానం, గర్వం ఇవన్నీ .ఏళ్ళుతరబడి గడ్డకట్టి ఒక వ్యక్తిగా ఏర్పడి ధ్యానంలో అడ్డుతగులుతోంది. పైకి పోనీకుండా.

దీనికి ఒక్కటేమార్గం కనిపించింది నివేదితకు. దీన్ని తానే నివారించుకోవాలి. గురువూ, దైవమూ ఎంత ప్రేమను తనకు వెదజల్లినా ఆ శక్తిని ఆత్మవరకూ పోనియకుండా, ఈ 'భూతం' వంటి 'వ్యక్తిత్వం' దాన్నంతా పీల్చివేసి స్వసంతుష్టి, తృప్తి, మమకారంగా మార్చి, ఆత్మకు చేరనివ్వకుండా అడ్డునిలిచింది - అహంభావంతో చిన్నప్పటి పెంపకంనుంచీ తనలో ఏర్పడ్డ ''వ్యక్తిత్వం'' అనబడే నీడ! ఆనాటి నుంచీ చిన్నప్పటి మార్గరెట్ నోబెల్‌కూ అదే శరీరంలో వున్న నివేదితకూ యుద్ధం ప్రారంభం అయింది! సాధన వంచి ''క్లయిమాక్సు'' స్థాయిని అందుకొంది !

స్వామి వివేకానందులు మౌనంగానే తన కనురెప్పల కిందనే చిన్నచూపుతో నివేదితలో జరుగుతున్న అంతర్యుద్ధాన్ని గమనించారు. తృప్తిగా నవ్వుకున్నారు ! సాధనలో గురువుపాత్ర అవసరమయ్యే తరుణం దగ్గిర పడుతోందని గమనించారు. ఇంకోరోజు క్లాసులో అందరూ శలవు తీసుకుంటూవుంటే నివేదిత వంక చూడకుండా ఎటో చూస్తూ

అన్నారు'' నేను కొన్నాళ్ళు అడవిలోకి ఒంటరిగా ధ్యానించుకోటానికి వెళుతున్నాను'' అని!

అంతే! నివేదిత హృదయంలో ఒక భూకంపం వంటి మార్పు ఎందుకో తనకే అర్థంకాని వేగంతో ఆరంభం అయింది. తనలో తానే ఒక దృఢనిశ్చయానికి వచ్చింది. ఏది ఏమైనాసరే తనలోని 'అహం'ను త్యజించాలి! తాను పూర్తిగా నివేదిత కావాలి. తనలో వున్న స్వంత భావాలు, అభిప్రాయాలు, గట్టి వ్యక్తిత్వపుకఠినత్వాన్ని మిగుల్చుకో కుండా గురుదేవుల పాదాలవద్ద త్యజించాలి !! మౌనంగా స్వామి పాదాల ముందు తలఆన్చి, నేలకి సాగిలబడి మ్రొక్కింది నివేదిత. నిటారుగా విగ్రహంలా, నిలబడివున్న స్వామి కన్నులు ధ్యానసముద్రంలో అరమూతలు పడినాయి. ఆమె శిరస్సు వంక ప్రేమతో చూస్తూ చేత్తో తలని స్వామి స్పృశించారు. ఏదో ఒక మార్పు రావడం గమనించింది నివేదిత, ఆ స్పర్శతో, ఆ చూపుతో పాదాల స్పర్శతో! చల్లని చందన శీతలమైన మనోమయమైన ఒక స్పర్శ తన మనస్సుని కరిగించివేసి తన వ్యక్తిత్వాన్నే హరించి వేయసాగింది. అప్పుడర్థమైంది సాధనలో గురువుపాత్ర! ఆయన ఒక్కచూపుతో, చిరునవ్వుతో, పాదస్పర్శతో గొప్ప మహిమ చేసిన మార్పులు -తాను ఎన్నేళ్ళుగా తపస్సుచేసినా దాటలేని అడ్డంకులు మంచులాకరిగిపోవటం అంటేఏమిటో అనుభవంతో తెలిసింది! అప్పుడాశ్చర్యపోయింది. గురువుయొక్క కరుణకు అనుగ్రహం యివ్వటం, మార్గదర్శకత్వం-ఇంతే కాదు, ఆంతరంగికత్వాన్నే



మార్చివేయగల మహామాంత్రికుని వంటిమార్పు అది! ఇనుమును అయస్కాంతం చేసే కరెంటు స్పర్శ గురువుదేనని గ్రహించింది!

అంతే ! మర్నాటినుండి నివేదిత తన అహంను దయా దాక్షిణ్యాలు లేకుండా తరిగివేసుకోటానికే నిశ్చయించుకున్నది. గర్వానికి విరుగుడు వినయం, నమ్రత, తన బసను చిన్నసందులోకి, నెం. 17 'బోసెపారా' వీధిలోని చిన్న పూరింటిలోకి మార్చుకుంది. రామకృష్ణ మఠసాధువుల సోదర బృందంలో సభ్యురాలయింది! స్వామి ఇంకొక సూచనకూడా చేశారు. ఈమార్పు స్థిరంగా వుండటానికి! ''నీవు నిర్వహించే కార్యం మానవులకు సేవ! అది గుర్తుంచుకో! నువ్వు ఎక్కడెక్కడ తిరిగి ఏ ప్రజలతో కలసి పని చేసినా ఎప్పుడూ నీవు వారికంటే ఎక్కువ తెలిసిన దానివనీ ఏదో బోధించటానికీ, ఉపదేశించటానికీగానీ, ఉద్ధరించటానికీగాని, పైనుంచి దిగివచ్చినట్టుగా భావం ప్రజల మనస్సులలో రాకూడదు. ఈ విషయంలో జాగ్రత్త వహించాలి నువ్వు! నీపని సేవచేసుకుంటూ పోవటమే !'' నివేదిత నమ్రతతో వంగి వారి పాదధూళి తన శిరస్సున గ్రహించింది, మారుమాట లేకుండా! మునుపైతే ప్రశ్నలూ, చర్చలూ - ఎన్నో!! అవన్నీ ఆపాత ''మార్గరెట్ నోబుల్'' (**Margaret Noble**) తోనే గతించిపోయినాయి. ఇపుడు మిగిలివున్నదల్లా నివేదిత! ఇపుడామె సంపూర్ణంగా నివేదిత (నివేదించుకున్నది) అయింది.

ఎంత పూర్తిగా ఆమె తన గురువు శాసనాన్ని తలదాల్చి వాటిని

ఆమె ఎంత హృదయపూర్వకంగా అమలు జరిపిందో చూడాలంటే ఈనాటికీ నిరాడంబరంగా ఏ గుర్తింపూ కోరకుండా నిలిచివున్నది, యిటుకలతో నిర్మించివున్న ఆమె సమాధియే మనకి కనిపించే మూగసాక్ష్యం !

కొద్దిరోజుల తర్వాత తను పెట్టుకున్న స్కూలును గురించి విమర్శించమని కోరింది స్వామి వివేకానందుని. "విమర్శించటమా? అది నావల్ల ఎలాగవుతుంది? నన్ను ప్రబోధన చేస్తున్న శక్తియే నిన్నూ ప్రబోధిస్తున్నది! 'అది' చేయించే పనులన్నీ నీవికావు ! నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో! వీలుంటే నీపని మధ్యలో తగినంత విశ్రాంతి తీసుకో" అంటూ ఆమెవంక అప్యాయంగా చూశారు, కళ్ళతోనే దీవిస్తూ.

నివేదితలో వస్తున్న మార్పును స్వామి గుర్తించారనటానికి కింకేమి సాక్ష్యం కావాలి ?

ఆ రోజు నవంబరు 13-1898. 'కాళీపూజ' చేసే పర్వదినం! ఆ రోజు నివేదిత జీవితంలో యింకో దీపకళిక వెలిగింది, అది తన గుడిసె నెం. 17 'బోసెపెరా' వీధిలోనే తెరువబడ్డ "స్కూలు". దాని నిప్పటికీ "నివేదిత స్కూలు" అనే పిలుస్తారు. ఆమె మాత్రం దాన్ని "రామకృష్ణ వివేకానంద మహిళాపాఠశాల" అనే పేరుతోనే పిలిచేది. ఆరోజు స్వయంగా శారదామణీదేవి ఆ స్కూలుకు వచ్చింది. అది నివేదితకూ, స్కూలు బాలికలకూ కూడా ఒక పండుగ దినం! స్వయంగా జగన్మాతయే వచ్చిన రోజు !



ఆ రోజును గురించి తన డైరీలో ఇలా రాసుకుంది నివేదిత కన్నీళ్ళతో, "నాజీవితంలో అది ఎంత శుభఘడియో ఊహించలేను! మాత ఆ స్కూలును దీవించటం ద్వారా భారతదేశంలోని భవిష్యత్తులో విద్యావంతులైన నారీలోకాన్నంతటినీ దీవించిందా శుభదినాన్న" అంటుంది నిజమే!

స్త్రీల విద్యకు ఇదేనాంది-కేవలం ఏదో చదువు కాదు-మహిళలను "భారతీయ మహిళలు"గా తీర్చిదిద్దే "విద్య"-కు ఈనాటికీ ఆ శుభాశీస్సులింకా ఎంతో అవసరం!

ఎందుకంటే నివేదిత ఈ స్కూలులో బాలికలకు నేర్పేదీ, నేర్పదలచిందీ, కేవలం చదవటమూ, వ్రాయటం, కుట్టుపనీ, చిత్రలేఖనం, శిల్పం, సంగీతం మాత్రమేకాదు. వారిని "భారతీయ మహిళలు"గా మార్చటం! భారతీయతను ఎన్నటికీ వదలవద్దని నివేదిత ఉపదేశం, ఈదేశపు నారీలోకానికి! "నివేదిత స్కూలు" వదలి పిల్లలు యిళ్ళ కెళ్ళటానికిష్టపడే వాళ్ళుకాదు! కారణం వాళ్ళకు ఎక్కడా కరువయ్యే ఆపేక్ష, ప్రేమ, మక్కువతో యిచ్చే శిక్షణా, తన హృదయంలోంచి దోచిపెట్టేది నివేదిత ! ఇది తన గురుదేవుని కార్యం! ఈ పవిత్రకార్యంలో తన జీవితమే నీరాజనంగా కర్పూరంలా వెలిగించి యిచ్చింది. నివేదిత తన గురుదేవుని హృదయానికి దగ్గిరయిన పనిలోనే తన జీవితాన్ని అర్పణ చేయటం ద్వారా ఆయన హృదయంలోనే ఒక

భాగంగా అయింది నివేదిత. అది యదార్థంగా ఎంత నిజమైందో చూడాలంటే అది, స్వామి ఆమెకిచ్చిన సందేశం ద్వారానే తెలుస్తుంది. సందేశం, అంటే మాటలు కాదు, నాజీవితమే నా సందేశం, అన్న మాటలు స్వామి విషయంలో యదార్థం అయినాయి.

ఎందుకంటే, ఆ రోజు స్వయంగా నివేదిత స్కూలుకు వచ్చారు. స్వయంగా స్కూలునీ, పిల్లల్నీ దీవించి వెళ్లారు తర్వాత రోజు చిరస్మరణీయమైంది. తేది జులై 2-సంవత్సరం 1902. అది పవిత్రమైన ఏకాదశీ పుణ్యతిథి. స్వామికి ఆ రోజున ఉపవాసం. ఏమీ తినలేదు! అనుష్ఠానంలో వున్నారు. స్వామిని దర్శించడానికి నివేదిత బేలూరుమఠం వెళ్ళింది. ఆయన తనకు దగ్గరగా కూర్చోపెట్టుకున్నారు నివేదితను. భోజనం తానే దగ్గరుండి చేయించారు. ఎంతో యిబ్బందిగా బాధపడింది నివేదిత. కానీ స్వామి ఊరుకోలేదు. భోజనం అయింతర్వాత తానేవెళ్ళి స్వయంగా నీళ్ళు పోశారు, చేతులు కడుక్కోనటానికి! అది చూసి నివేదిత చకితురాలయింది. ఏమిటి? స్వామి తనకు సేవచేయడమా? ఆశ్చర్యంలోంచి తేరుకునేలోగానే ఆయన ఒక తువ్వాలుతో ఆమె తడిచేతులను అద్ది, తుడిచారు. ఒక్కసారిగా ఉలిక్కిపడింది, నివేదిత. 'తమరు నాగురుదేవులు! మీకు నేను సేవలు చేయడం పోయి మీరా! నాకు సేవచేయటం ఇది తప్పుకాదా?'

స్వామి నవ్వుతూ అన్నారు! ''నువ్వు బైబిల్ (Bible) చదవలేదా! అందులో 'క్రీస్తు' తన శిష్యులకు తానుగా కాళ్ళుకడిగారుగదా!''



''కానీ అదివారి అంతిమ కార్యం'' అనబోయి అంతలో చటుక్కున నాలిక్కరుచుకొని ఊరుకున్నది. సాలోచనగా తన బసకు చేరుకున్నది. స్వామి విచిత్రమైన చర్యకు, ఆయనకు శిష్యులపై వున్న ప్రగాఢ ప్రేమకు విస్తుపోతూ!

సాయంత్రం మఠంనుంచి స్వామి ఒక వర్తమానం పంపారు. ''నేను చాలా సంతోషంగా వున్నాను'' అని. ఆ మర్నాడే ప్రొద్దున మఠం నుంచి పరుగులు పెడుతూ యింకొక బ్రహ్మచారి వచ్చాడు-ఆ రాత్రే స్వామి పరమపదించారని!

నివేదిత కాళ్ళకింద భూమి కంపించి నట్టయింది. ఎలా వున్నది అలాగే ఒక్క ఉరుకున వెళ్లి బేలూరుమఠం చేరుకుంది.

అప్పటికప్పుడే మఠంలో యావన్మందీ గుమిగూడి వున్నారు. వేదమంత్రాలు పఠిస్తూ! స్వామి భౌతికశరీరం ప్రశాంతంగా చిరునవ్వుతో నిద్రపోతున్నట్టుంది ! ఆ క్షణంనుంచే ఒక్క క్షణంకూడా తాను ఆయన ప్రక్కనుండి విడువలేదు. విసనకర్రతో, డస్సిపోయిన ఆయన శరీరానికి కడసారిగా సేవచేస్తూ మృదువుగా విసరుతూ కూర్చున్నది. కన్నీటి చుక్కలేదు మాటలేదు, శిలా ప్రతిమలా! స్వామి శరీరంపై కాషాయం కప్పి శరీరమును ఆయన తాను ముందే నిర్ణయించుకున్న జాగాలో దహనం చేస్తూంటే ఆమె ఆఖరువరకూ అక్కడే నిలబడి చూచింది, సాంతం బూడిద అయిందాకా! ''శివా! శివా!'' అని మాటి మాటికి తన దైవాన్ని తలచే స్వామి చివరికి శివుని ఒడిలోనే శాశ్వత

విశ్రాంతి తీసుకోవడానికి వెళ్లిపోయారు. ఇక తనను వదిలివేసి! ఆయన కడసారి తనకు చేతులు కడిగి సేవచేయటం మరిచిపోగలదా!

కానీ తనకు జీవితంలో ఇక విశ్రాంతిలేదు. ఆనాడే ఒక దృఢ నిశ్చయం చేసుకున్న దానిలా కార్యరంగంలో జొరబడింది నివేదిత! ఇన్నాళ్ళుగా లోపల తనను తాను ఆపుకుంటూ ఉన్న బంధాలన్ని తెంపుకున్నట్టయిందామెకు! ఏదో దేవత ఆవేశించిన దానిలా పనిచేయడం ఆరంభించింది! తన గురుదేవుడు ప్రేమించిన పని తనది! తను ఆయనకు ఈ విధంగా సేవచేస్తుంది ! ఎప్పుడూ మనస్సునిండుగా ఏదీ చేయలేదు. ఆయన యివ్వటమేగాని ఎవరినుంచీ ఏదీ కోరలేదు. అదే తనకు తన స్వామి యిచ్చిన సందేశం! విశాల ప్రపంచంలోకి అడుగు పెడుతున్న తన స్వామి యిచ్చిన దీవనలింకా తన చెవుల్లో మారుమ్రోగుతున్నాయి, మర్చిపోగలదా, ఆ కంఠం! ఆ హృదయం! ఆ దీవెన...... ఇదే

''కన్న తల్లి మనసూ
మహాయోధుని దృఢసంకల్పమూ,
మలయ మారుతంలోని లాలీ,
దేవుని గుడిలోని దీపాల ఆరనిజ్యోతి,
పవిత్ర వేదమంత్రాలలోని బలం, అన్నీ
... ఈ అన్నీ ...నీవిగా'' ''యిన్నీ -
ఇంకెన్నో! నీకు దీవెనలై తోడురాగా
నా, భారతదేశపు పసిపిల్లలకు
''నీవే....తల్లీ, గురువూ, సేవిక, నేస్తం, ఈ
కలిసిన అన్నీగా...మనవే తల్లీ!
''ఇవే నా ఆశీస్సులు''



అంటూ స్వామి వివేకానందులు ఏనాడో తనకు వ్రాసిన మంగళగీతం! ఈనాడు సోదరి నివేదిత హృదయంలోంచి, అదే సందేశం మళ్ళీ మళ్ళీ విషాదంగా మరపురాకుండా మారుమ్రోగుతూంటే, ఈనాడు కార్యరంగంలోకి అడుగుపెట్టింది ! ఈసారి కదనరంగం నుంచి నిష్క్రమించేది తాను కాదు, తన ప్రాణాలే !

## నిస్వార్థసేవయే గురుపాద సేవ

ఎక్కడ చూచినా సోదరి నివేదిత వార్తలే. ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వానికి వినిపించసాగాయి ! ఎక్కడ ప్రజలకు బాధలుకలిగినా పరుగిడిపోయి వాళ్ళ సేవలో నివేదిత ప్రత్యక్షమయ్యేది. ''నివేదిత'' దీనులకు, పేదరికంతో, ఆకలితో, రోగాలతో, మ్రగ్గి కృశించిపోయే దరిద్రనారాయణులకు ఈ సమాజములో వేరే ఎవ్వరూ సాయం చేసేవారుగానీ, తలచేవారుగానీ లేరు - నివేదిత తప్ప ! ఆ సంవత్సరం మార్చిలో, కలకత్తాలో భయంకర ప్లేగుజాడ్యం వ్యాపించి, వేలమందిని తుడిచిపెట్టేసింది! ఎక్కడ విన్నా ఈ భయంకరమైన 'బొబ్బల వ్యాధికి' గురైన నిర్భాగ్యుల వార్తలే !

ఈ అంటువ్యాధికిజడిసి మన స్వభావానికి తగినట్లుగానే భారతీయులెవ్వరూ ముందుకి రావడానికి సాహసించలేదు. రోడ్లు దాదాపుగా నిర్మానుష్యంగా ఉండేవి. ఇక బీదవారి సంగతి. దిక్కులేని వారి సంగతి అడిగే వారేలేరు. ఈ పరిస్థితిలో కలకత్తాలోని ప్రజలు మూక ఉమ్మడిగా ఊరును ఖాళీచేసి తరలి పోనారంభించారు. అలా

పోవడానికి డబ్బుగాని, వసతికాని, ధైర్యంకాని లేనివారు ఏమి చేయాలో దిక్కుతోచక బిక్కు బిక్కుమంటూ అలా పూరిపాకల్లోనే, గుడిసెలలోనే అరచేతిల్లో ప్రాణాలు పెట్టుకుని బిక్కు బిక్కున కూర్చో సాగారు. మృత్యువుకోసం ఎదురుచూడసాగారు. ఈభయంకర విపత్సమయంతో స్వామి వివేకానందుడు తన శిష్యులైన బ్రహ్మచారులను, సాధకులను, నిస్వార్థసేవలోకి, కార్యరంగంలోకి దూకమని ఆజ్ఞనిచ్చారు. దానితో ఒక్కసారిగా నిస్వార్థసేవా పరాయణులైన సాధకులు రామకృష్ణ మిషన్ వాలంటీర్లకు నారాయణసేవకు, దరిద్రనారాయణ సేవకు, అమూల్యమైన అవకాశం లభించింది!! నిస్వార్థసేవతో తన జీవితాల్లోని చెడుకర్మను స్వార్థాన్ని, సోమరితనాన్ని తుడిచి వేయడానికి ఆధ్యాత్మిక సాధనకు భగవంతుడు చూపించిన అమూల్యమైన అవకాశంగా ఈ సన్నివేశాన్ని భావించి సోదరి నివేదిత. తనకు తానే కార్యరంగంలో ప్రవేశించింది. ఆనాటి సాధకులలో, వాలంటీర్లలో, ఒక 'ప్లేగు సహాయకదళం' అనే ఆధ్యాత్మిక సైన్యం తయారుచేసింది. దానికి సోదరి నివేదితయే నాయకురాలని వేరే చెప్పక్కరలేదు. ఇంకెవరూ ఈ భయంకరమైన అంటువ్యాధిని లెక్కచేయకుండా రోగులను తాకి సేవచేయడం - తన గురుదేవులకు చేసే సేవగా భావించి మహాభాగ్యంగా చేయగల వారింకెవరున్నారు.

తన సేవాదళంలో యువకులు, బలిష్ఠులైనవారిని లేవలేనిస్థితిలో వున్న రోగులను మోసుకొని వెళ్ళి సేవాదళ శిబిరానికి చేర్చడానికి



నియోగించింది. మురికితో, దరిద్రంతో, కుళ్ళుతో ఆ మంచాన్ని పట్టి కృశిస్తున్న రోగులను వారి గుడిసెలలోంచి బయటికి తీసుకురావటం యీ సేవకుల ముందు కార్యక్రమం. ఆ తరువాత తానూ మిగతా స్త్రీ సేవకులు కలసి మురికితో, రోగంతో, మలమూత్రాలతో నిండివున్న వాళ్ళ గుడిసెలను ఊడ్చి, శుభ్రంచేసి మందుపొడిని చల్లించి, విషక్రిములను నివారించే పనిపట్టింది!

బజారుల్లో చెత్త, మురికి పేరుకుపోయి ఉన్నది. రోగానికి భయపడి నిర్మానుష్యంగా వున్న బజారులను గూర్చి పట్టించుకొనే నాధుడే లేడు. అక్కడా తనే ప్రత్యక్షమయింది నివేదిత! స్వయంగా తానే చీపురుతీసి కొని బజార్లు ఊడ్చుకుంటూ రేకుడబ్బాలో, రోడ్లుపక్క బడిన మల మూత్రాలు ఎత్తివేస్తూ శుభ్రం చేయసాగింది. అదిచూసి సిగ్గుపడి తోటి బెంగాలీ యువకులు, యోగులు రామకృష్ణ మఠసన్యాసులు, రోడ్లను తుడవడం ఆరంభించారు.

## దరిద్ర నారాయణ సేవ :-

బజార్లలో ఎక్కడ చూచినా నివేదిత ఆశయంతో పులకించే కార్యకర్తలు, సాధకులు, నిస్వార్థంగా పనిచేయడం కనిపించింది. రోడ్లు ఊడ్చేవాళ్ళు, బీదప్రజల గుడిసెలు, మురికి వాడలను స్వయంగా శుభ్రంచేయడం, రోగులకు సేవచేయడం వంటివి, కొందరు చేస్తుంటే మరి కొందరు ప్లేగు పీడితులకు మందులూ, వైద్య చికిత్స, ఉచితంగా భారీ ఎత్తున ఏర్పాటు చేయసాగారు. ఉన్నత కుటుంబాలనుంచి

వచ్చినవారూ, పెద్ద చదువులు చదువుకున్నవారూ, సంఘంలో ఉన్నత వ్యక్తులకొనేవారూ చాలమంది, నివేదిత చేస్తున్న ఈ నిస్వార్థ సేవను చూసి సిగ్గుతెచ్చుకుని తమ తమ అంతస్థులనూ, హోదాలనూ సైతం మరచిపోయి నిస్వార్థసేవ చేసే సాధకుల ''సేవాదళం''తో పాటు తామూ పని చేయసాగారు.

ఇంతేకాదు! నివేదిత, మురికివాడల్లో - ''ప్లేగు నివారణ కార్యక్రమంలో విద్యార్థుల పాత్ర'' - అన్న అంశంపై ఉపన్యాసం ఇచ్చింది. ఇది విన్న విద్యార్థులూ, బాల బాలికలూ, మరింత ఉత్సాహంతో ముందుకు దూకారు. రోగులకు సేవచేయాలంటే కేవలం ఆవేశమూ, ఉద్రేకం చాలవు! శిక్షణ కావాలి. కాబట్టి సేవచేయడానికి సిద్ధంగా ముందుకు వచ్చిన యువతీ యువకులకు, రోగులకు చేయవలసిన సేవ, చికిత్సవంటివి ఎలాగ చేయాలో తెలిపే శిక్షణ ఇవ్వబడింది! అంతేకాకుండా ఏవిధమైన ఆహారం ఎవరికి ఇవ్వాలో, ఎంత ఇవ్వాలో తెలపడం, మురికివాడల పారిశుధ్యమూ, మలమూత్రాలను ఎత్తివేయడంలో తీసుకొనవలసిన జాగ్రత్తలు మొదలైన అనేక విషయాలను వివరంగా తెలిపే శిక్షణ కూడా నివేదిత ఏర్పాటు చేసింది. అంతేకాక ఈ సేవాదళ వాలంటీర్లు అనారోగ్యానికి గురికాకుండా తీసుకోవలసిన రక్షణ చర్యలూ - స్నానం, ఆహారం, విశ్రాంతి వంటి అనేక విషయాల్లో తీసుకోవలసిన శ్రద్ధ, క్రమశిక్షణ, అన్నీ తాను స్వయంగా చూసుకొనేది నివేదిత !



## దీనులకు తల్లి :-

అలా అని, బాధితుల సేవను ఆమె అశ్రద్ధ చేసిందని కాదు అర్థం. ఒక రోజున ఆమె తన కుటీరానికి తిరిగి రాగానే ఆమెకెలాగో తెలిసింది, తన ఇంటికి ప్రక్కసందులోనే ఒక చిన్నపిల్లవాడు భయంకరమైన ఈ ప్లేగువ్యాధి సోకి బాధపడుతున్నాడని! వెంటనే తన శ్రమనంతా మరచిపోయి విశ్రాంతిమాట విడిచిపెట్టి, వారి గుడిసెకు వెళ్ళి, ప్లేగు బొబ్బలతో బాధపడుతున్న ఆ పసివాడిని తల్లిలా తన ఒళ్ళో వేసుకుని రాత్రింబవళ్లు సేవచేయ నారంభించింది. గంట గంటకూ ఆహారం, మందు, పథ్యాదులను ఆత్రుతతో కనిపెట్టివుండి ఆ పసివాణ్ణి ఆదుకున్నది! కాని ఆ దురదృష్టవంతుడు చివరికి ఆ ప్లేగువ్యాధికి బలైపోయాడు. అయితే నేమి? అతను ఆఖరి క్షణాల్లో నివేదిత చేతులలో ప్రశాంతంగా కన్నుమూశాడు ఆ పిల్లవాడు - తల్లిలాగ సేవచేసిన నివేదిత కరుణాపూరితమైన దేవతలాంటి కళ్ళలోకి చూస్తూ ఓ చిరునవ్వు నవ్వి ప్రాణం విడిచాడు.

నివేదిత చేసిన అపారమైన నిస్వార్థసేవ ప్రభుత్వం దృష్టికి రావడంతో - దేశమంతటా - విదేశాలనుంచికూడా వచ్చి, భారతదేశంను సొంతం చేసుకున్న, నివేదిత సేవ గురించి ప్రజలకు తెలియనారంభించింది. కలకత్తాలోని జిల్లా అధికారి (District Medical Officer) తన పై అధికారులకు పంపిన రిపోర్టులో ఇలా వ్రాసాడు :-

''ఇప్పటి భయంకర పరిస్థితిలో 'సోదరి నివేదిత' యొక్క దయా పూరితమైన వ్యక్తిత్వం ఎక్కడ చూసినా, మురికివాడల్లోనూ, బీదవారి నివాసాల దగ్గర, తరచు మనకు కనిపిస్తున్నది. ప్రత్యేకంగా ''బాగ్-బజార్'' (Bagh Bazar) ప్రాంతంలో ఆమె చేసిన సేవ ఎంతో అపూర్వమైనది! ఇంకా చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే, నిరంతరమూ ఈ రోగులకు సేవచేస్తున్న 'సోదరి నివేదిత' తన విశ్రాంతిని గురించికానీ, ఆరోగ్యం గురించికానీ, అవుంతైనా శ్రద్ధచూపడము లేదు. తన పరిస్థితి గురించి పూర్తిగా మరచిపోయి ఇతరుల సేవలోనే, ఆమె ఆనందాన్ని పొందడం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఈ సమయంలో ఆమె తీసుకొనే కొంచెంపాటి ఆహారమైనా ( కొంచెం పాలూ, ఆ కొన్ని పళ్లు మాత్రమే) ఒక బీదపిల్లవాడి చికిత్సకోసం ఆమె తీసుకొనే ఈ కొంచెం పాలూ మానేసి, ఆ డబ్బుతో అతనికి మందులు కొని, తాను అలానే కాలక్షేపం చేసింది!'' పై విషయాలు ఒక మెడికల్ అధికారి స్వయంగా వ్రాసిన 'రిపోర్టు'లోనివి. ఇవి, మిత్రులు వ్రాసిన ప్రశంసా వాక్యాలు కావు.

ప్లేగు ప్రమాదం తగ్గుముఖం పట్టగానే ఆమె తన భారతీయ బాలికల కోసం ఏర్పాటు చేసిన 'స్కూలు' నడిపించడంలో తిరిగి పూర్తి శ్రద్ధ వహించసాగింది. ఆమెకు తన స్కూల్లో తయారయిన బాలికల పూర్తి భారతీయమైన విద్య' నేర్పి నూటికి నూరుపాళ్ళు సనాతన భారత మహిళలను మరపించేలా పవిత్ర మూర్తులుగా



భారతమాత పూదోటలోని తులసి మొక్కలుగా వారిని తీర్చిదిద్దాలని ఆమె ఆరాటం. అంతేకాదు, ఆమె భారతీయులను విదేశీయులుగా మార్చే ఆనాటి ఇంగ్లీషు విద్యావిధానానికి పూర్తి వ్యతిరేకి విదేశీ స్త్రీలలాగ జుట్టు కత్తిరించుకుని, వీధులలో తిరిగే ఆట బొమ్మలలాగ అవయవాలను ప్రదర్శిస్తూ బ్రతకడం - ప్రాచీన భారతీయ సంస్కృతికే మాయని మచ్చగా ఆమె భావించింది అందుకే సోదరి నివేదిత తను ఏర్పాటుచేసిన బాలికా పాఠశాలలో నూటికి నూరుపాళ్ళు 'భారతీయత' ఉట్టిపడే కట్టూ, బొట్టూ, జుట్టూ, ఆచార వ్యవహారాలతోనూ, అచ్చం ప్రాచీన మునికన్యల వలే తీర్చిదిద్దింది. ఆమె నేర్పే చిత్రకళలో కూడా విద్యార్థినులకు నూటికి నూరుపాళ్ళు భారతీయ చిత్రకళనే నేర్పింది.

ఆనాటి హిందూ ప్రజలనే విదేశీయులను అనుసరించే చిత్రకళ కాకుండా అజంతా, ఎల్లోరావంటి భారతీయ కళాఖండాల అడుగుజాల్లో రంగరించిన కళావిధానం, గ్రామ జీవితాన్నీ, జనసామాన్యంలోని అభిరుచులనూ, వెలికితెచ్చే, స్వదేశీయ కళాసృష్టినే ఆమె ప్రోత్సహించింది. ఈమె ఏర్పరచిన జాతీయ విద్యా విధానం (National Education) భారతీయులైన మనకందరికీ ఈనాటికీ కనువిప్పు కాగలదు! ఈసందర్భంలో ఈమె ఒకసారి విశ్వకవి రవీంద్రునికే కళ్ళు తెరిపించినది. ఇలాంటి ఒక సంఘటన మనకి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అది ఎలా జరిగిందో చూద్దాము.

విశ్వకవి రవీంద్రుడు 1893లో సోదరి నివేదితను కలుసుకోవడం

తటస్థించినది. ఆమెలోని ప్రగాఢమైన భారతదేశ భక్తి, భారతమాతంటే ఆమెకున్న అచంచల విశ్వాసం, పూజ్యభావం... ఇవన్నీ రవీంద్రుని ఆశ్చర్యంలో ముంచివేశాయి. మరు సంవత్సరం నివేదిత రవీంద్రుని తండ్రియైన దేవేంద్రనాథ మహర్షిని చేడడం తటస్థించింది. మహాఋషి వంటి ఆయన రూపం, గడ్డం చూచి, నివేదిత ఎంతో ముగ్ధురాలైంది. ఆ సందర్భంలో నివేదిత చేస్తున్న నిస్వార్థసేవ గురించివిన్న రవీంద్రుడు, భారతీయ స్త్రీలను ఉద్ధరించడానికి ఒక చక్కని ''కాన్వెంటు స్కూలు'' లాంటి స్కూలు ను ప్రారంభించమని కోరగా, పాశ్చాత్య పద్ధతులలోని స్కూలు మాత్రం ఎప్పటికీ ఆరంభించనని'' ఖచ్చితంగా నిరాకరించింది.

నివేదిత ఈ సమాధానానికి తల తిరిగి పోయిన రవీంద్రుడు నిర్విణ్ణుడై తన భారతీయతలో చిన్నతనం గుర్తించాడు. ఫలితంగా ఆ తర్వాత 1904లో నివేదిత ఆరంభించిన స్కూలుకు రవీంద్రుడు పెద్దకుమారుడైన రవీంద్రనాథ్‌నూ, కొంతమంది విద్యార్థులతో పంపించాడు. తర్వాత నివేదిత ఆ విద్యార్థులను హిమాలయ పర్వతాలకు తనతో బాటు తీసుకు వెళ్ళింది. వారి అనుభవం ఆ మహోన్నతమైన మంచు శిఖరాలలో వారి జీవితంలో ఎన్నటికీ మరపురాని భారతీయ ముద్రను వేసుకున్నాయి.

ఆ తర్వాత కొంతకాలానికి రవీంద్రుని సోదరుడు 'అవనీంద్రనాథ టాగూర్' సోదరి నివేదితను కలుసుకొని ఆమెవల్ల ఎంతో



ప్రభావితుడైనాడు అప్పటికి అవనీంద్రుడు కలకత్తాలో చిత్రకళా స్కూలుకు (Art School) వైస్ ప్రిన్సిపాల్ (Vice Principal)గా పనిచేస్తున్నాడు.

ఫలితంగా ఈనాడు స్వచ్ఛమైన భారతీయ శిల్పకళకు ప్రతిరూపమైన అవనీంద్రనాథుడు, నందలాల్‌బోస్ వంటి మహామహులు, భారతీయ చిత్రకళకు ప్రాణం పోశారు! ఇదంతా సోదరి నివేదిత వంటి పాత్రను చక్కగా చిత్రించి ''పరిచయం'' అన్న తన పుస్తకంలో మన కందించటం జరిగింది.

తెల్లని బట్టలు ధరించి, తపస్సు చేసుకునే భారతీయ మునికన్యలా ఉన్న నివేదిత, మెడలో ధరించిన రుద్రాక్షమాలతో తలపైకి ముడితిప్పి చుట్టి, కట్టుకున్న జడలకు అలంకరించిన తులసిపూలతో, హిమాలయాల్లో ధ్యానిస్తుంటే ఆనాడు శివునికై తపస్సు చేసిన పార్వతీదేవివలే, తెల్లని పాలరాయివంటి ఆమె ప్రశాంత గంభీరమైన వదనంతో తెల్లగా తళతళా మెరిసే మంచు లోయలలో ధ్యానిస్తూండే ప్రశాంత గంభీరమైన నివేదిత అప్పటి రూపం ప్రాచీన భారతీయ స్త్రీకి ప్రతీకగా వెల్లివిరిసింది!

భారతదేశానికి స్వాతంత్ర్యం వస్తే తిరిగి భారతీయ సంస్కృతిని ఎలా పునర్నిర్మాణం చేయాలో పూజ్యులైన తన గురుదేవుని కలలను పండించే నందనవనంగా తన 'స్వామి' తన భారతదేశాన్ని ఎలా రూపులు దిద్దాలో నివేదిత వ్రాసిన రచనలు చూస్తే గుండెలు ద్రవించేలాగ

ఈనాటికీ మనకళ్ళకి కట్టినట్టు కనిపిస్తున్నాయి. భారతదేశ సముద్ధరణంటే ఎలా జరగాలో నివేదిత తయారు చేసిన 'నిర్మాణ కార్యక్రమం' చూస్తే మనకు తెలుస్తుంది. సోదరి నివేదిత దృఢంగా నమ్మింది! భారతదేశానికి స్వాతంత్ర్యం తప్పక వచ్చి తీరుతుందనీ, అది కొద్దికాలంలోనే వచ్చితీరుతుందనీ - అందుకనే దేశంలోని మేధావులందరినీ కలుసుకొని వివిధ రంగాలలో వారి అనుభవాన్ని పుణికి పుచ్చుకుని భారత సంస్కృతి పునర్నిర్మాణానికి, హిందూజాతియొక్క ఉజ్వల భవిష్యత్తు, దాని సందేశాన్ని, ప్రపంచమంతా అందచేయటానికి ఆమె ఊహలు చేయసాగింది. ఊహలే కాదు అలా అన్నందుకు అవసరమైన ఒక నిర్మాణ కార్యక్రమాన్ని రూపొందించాలని మొదలుపెట్టింది. ఈ ఉద్దేశ్యముతోనే దేశంలోని పెద్దలందరిని కలిసింది.

శ్రీ అరవిందఘోష్, బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణ గోఖలే, బిపిన్ చంద్రపాల్, రమేష్‌చంద్రదత్త, గాంధీ మహాత్ముడు, వీరందరు, సోదరి నివేదిత, దీక్షకు, త్యాగానికి ముగ్దులయ్యారు. భారతజాతిపైన ఆమెకున్న అపేక్ష, ఆదరణ చూసి ఆనందంతో చలించిపోయారు. ఆమెను విదేశస్తురాలుగా వారు భావించలేదని వారి మాటలే నిదర్శనం.

ఆమె యొక్క అపారమైన దేశభక్తిని, హిందూమతం అంటే ఆమెకున్న గౌరవాన్నిచూసి నివ్వెరపోయాను'' అన్నారు గాంధీజీ! గోపాలకృష్ణ గోఖలే - ''ఆమె మన మధ్యకు వచ్చి పనిచేయటానికి కారణం భారతమాత పిలుపును ఆమె ఆత్మలో అందుకున్నది. ఆమె



భారతమాతను సమర్పించి భరతమాత బిడ్డలతో పాటు తనకూ ఒక శాశ్వతమైన స్థానాన్ని ఆమె ఏర్పరచుకొన్నది''.

## భారతమాత పూజారిణి :

''అసలు మనలో ఎవరైనా సోదరి నివేదిత భారతదేశాన్ని ప్రేమించినంతగా ప్రేమించే వాళ్ళున్నారా?'' అని బిపిన్ చంద్రపాల్ సూటిగా అన్నారు. ''దేశంలో ఈనాడు ఎండిపోయిన ఎముక గూళ్ళు సైతం ప్రాణంతో కదలుతున్నాయంటే కారణం, భారతజాతికి సోదరి నివేదిత ఊపిరిపోసి, తన ప్రాణంతోనే నింపింది!'' అందరికంటే ఎక్కువగా సోదరి నివేదిత యొక్క భారత దేశభక్తిని చూసి నివ్వెరపోయినవాడు సురేంద్రనాథ్ బెనర్జీ - ''ఆమె ప్రతి అణువూ, భారతీయతను నింపుకున్న ఆమె శరీరంలో ఎముకలు సైతం భారతీయ సంస్కృతితో తొణికిసలాడుతున్నాయి'' అనేక దేశాలలో పెద్దలను కలసి వారి సలహాలను ఆశీస్సులను పొందినా, నివేదిత యువతరాన్ని మాత్రం మరచిపోలేదు.

ఆమె సమాన వయస్సులోనే ఉన్న జదునాథ సర్కార్‌తో కలసి ఆయన చేసిన చరిత్రపరిశోధనల్లో భారతీయత ఉట్టిపడేలా ఆయనను ప్రభావితం చేసింది. అలానే దేశభక్తుడూ, కవీ సుబ్రహ్మణ్య భారతినీ, ఆనాటి ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవత్త వినయసర్కార్‌ను, చరిత్ర పరిశోధకులు రాధా కుముద్‌ముఖర్జీ మాత్రమేకాక, ప్రఖ్యత కళాకారులైన

నందలాల్ బోసూ, అసిత్ హలధాలరు, సురేంద్రనాథ్‌లు సైతం తమరంగుల్లో కుంచెల్లోనూ సోదరి నివేదిత ఉత్సాహంతో కొత్త చైతాన్యాన్ని నింపుకొన్నారనీ చెప్పకతప్పదు! తను కలసిన యువతరం వారినందరినీ ఆమె ఎంతో ప్రోత్సాహించి, వారిని పరిపూర్ణ భారతీయతతో వెలుగొందమనీ, భారతమాత గొప్పతనాన్ని కీర్తించమనీ ప్రభోధించటమే నివేదిత యొక్క జీవిత సర్వస్వం! అదే ఆమె తన గురుదేవులు స్వామి వివేకానందునకు సమర్పించిన గురుదక్షిణ!! తన గురుదేవుల జన్మభూమిని ఆరాధించకుండా ఆమె ఎలా ఉండగలదు? తన స్వామి-వివేకానందుడు నడచిన భారతదేశం యొక్క ధూళిని శిరస్సున ధరించకుండా ఎలా ఉండగలదు? ఇదే సోదరి నివేదిత జీవితం వెనుక వెలిగే నిస్వార్థ త్యాగజ్యోతి, గురుభక్తి !!!

## భారతమాతకు నివేదన !

సోదరి నివేదిత ఇలా కేవలం ఇతరులని ప్రభోధించటంతో ఊరుకోలేదు, తన గురుదేవునినుండి తాను పొందిన భారతీయ సంస్కృతి యొక్క అఖండ విజ్ఞానాన్ని యావత్తూ చల్లచిలికినట్లు మధించి, అందులోంచి సారం వెన్నపూసలాగ తన చిట్టితమ్ముళ్ళూ, చిన్నచెల్లాయిలు ఐన భారతీయులకు పంచిపెట్టింది. ఇలాంటివి అందమైన పుస్తకాలు ఆమె ఎన్నో రాసింది. అందులో కొన్ని ముఖ్యమైనవి ''ఉయ్యాల్లో బిడ్డలకు హిందూమతంగాధలు'' ''హిందువుల, బౌద్ధుల ప్రాచీన గాథలు'' ''లోకమాత కాళికామాయి'' ''శివునిగాథ'' ''బుద్ధుని చరిత్ర'' మతం - ధర్మం వంటివేకాక, ఇంకా, ''తోడేళ్ళ మధ్య మేకపిల్లలు'' అన్న అందమైన రచనలు ఎన్నో చేయడమేకాక తాను ప్రత్యక్షంగా సజీవమూర్తిగా చూచిన తన గురుదేవుని రూపం కళ్ళతో చూడడానికి నోచుకోని రానున్న భావితరాల భారతీయ బిడ్డలకు ఆయనమూర్తి చిత్రం సజీవమైనది అందించింది. అది స్వామి వివేకానందునిపై ఆమె రచించిన అందమైన చిన్నపిల్లల గ్రంథం ''నేను కనుగొన్న నా గురుదేవులు!'' ఇంకో గ్రంధంలో స్వామి వివేకానందునితో తన అనుభవాలు సేకరించి రాసింది. ''స్వామి వివేకానందులతోటి పర్యటన విశేషాలు'' మొదలైనవి. ఆమె స్వామితో తన అనుభవాలనూ, ఆయన క్షణం క్షణం అందించే అమూల్య సందేశాలనూ ఆయన యొక్క పవిత్ర హృదయాన్నీ, ప్రేమ తత్వాన్ని పసిపిల్ల వానివంటి అమాయక ప్రవృత్తినీ మనకు సరిగ్గా కళ్ళకు కట్టినట్లు చిత్రించింది సోదరి నివేదిత. ఈనాడు మనకు వివేకానందుని చిత్రం మన కళ్ళ ముందు నిలబడాలంటే సజీవంగా చైతన్యవంతంగా నవ్వుతూ, ఆడుతూ, నవ్విస్తూ, ప్రేమమూర్తిగా, జ్ఞానస్వరూపిగా, త్యాగావతారుడుగా - ఆయన నిజంగా ఎలా ఉండేవారో అలాగే మనం దర్శించాలంటే - అందుకు సోదరి నివేదిత రచనలే ఆధారం. అవే భారతీయులకు ఆమె పెట్టిన భిక్ష! ఇది ఆమె గురుదేవులు పెట్టిన జ్ఞానభిక్షకు, ఆమె సమర్పించిన అమూల్య గురుదక్షిణలో పూజాపుష్పాల వంటివి :

స్వామి వివేకానందుని నిర్యాణానంతరం, సోదరి నివేదిత మరింత

ఉధృతంగా, నిరంతర కార్యరంగంలో ప్రవేశించినప్పటినుంచీ, సంవత్సరాల తరబడి, రాత్రనక పగలనక ఏ ఒక్క అంశాన్నీ విడిచిపెట్టక, చేసిన శ్రమ ఆమె ఆరోగ్యాన్ని బలితీసుకొనారంభించింది. వాటికి తోడు, ఆమె కఠోర దినచర్య, అతి పరిమితమైన ఆహారమూ, అతి స్వల్ప విశ్రాంతికూడ తోడై 1905లో ఆమె తీవ్రంగా జబ్బుపడింది. తన ప్రియమైన భారతమాతకు సేవచేయడానికి ఆటంకమై సోదరి నివేదిత తను అనుకున్నంతగా పనిచేయలేనందుకు నానాటికి శరీరంలో నీరసం, అనారోగ్యం పేరుకుపోతూంటే తన శరీరాన్ని మరింత కదల్చి, ముసలి ఎద్దునుబండి లాగిరచినట్లు, బలవంతంగా చరించసాగింది.

ఇంతలోకే 1906లో తూర్పు బెంగాల్‌లో వరదల భీభత్సం భయంకరమైన కరువూ, సంభవించాయి, ప్రజలు మలమలమాడి నిలవనీడ లేకుండా బాధపడుతూంటే సోదరి నివేదితకు, తన అనారోగ్యాన్ని గురించి పట్టించుకునే వ్యవధికూడా లేకపోయింది. ఆమె అక్కడి ప్రజల బాధల గురించి విన్నవెంటనే కలకలత్తానుంచి బయలుదేరి బారిసాల్ (Barisal)కు వెళ్ళింది. అక్కడినుంచి ఆమె మైళ్ళు తరబడి కాలినడకన ఒక గ్రామంనుంచి ఇంకొక గ్రామానికి వెడుతూ అనేకమంది నిరాశ్రయులకు సేవలూ, మందులు అందిస్తూ, బాధితులకు, దుఃఖితులకూ తన చిరునవ్వుతోనే ఆనందాన్ని, ఉత్సాహాన్ని కల్పిస్తూ వారి కష్టాలన్నీ విని, ప్రతివారినీ ఓదారుస్తూ, ముందుకు పోసాగింది.

ఇబ్బందులూ, అసౌకర్యాలూ, మురికీ, అనారోగ్యం ఆమె చేసే నిస్వార్థసేవకు ఏమాత్రం అడ్డుకోలేకపోయినాయి. మోకాలిలోతు నీటిలో, బురదలో ఈడ్చుకుంటూ వెళ్ళాల్సి వచ్చేది. ఇక్కడే ఆమె మొట్టమొదటి సారిగా, తను నమ్మలేనంత భయంకరమైన బీదరికాన్ని, ప్రజల దారిద్ర్యాన్నీ, కష్టాలనుచూచి ద్రవించిపోయింది. అన్ని కష్టాలలోనూ వారు చూపే నిబ్బరం ఓర్పు చూచి, ఆమెకు భారతీయుల ఎడల గౌరవం మరింత పెరిగింది. ఆమెకు తీవ్రమైన మలేరియా జ్వరంతాకి, చలితో వణికి పోసాగింది. అయినా జ్వరం తగ్గిన మధ్య సమయంలో ఆమె ముందుకు పోతూ, తన సేవాకార్యక్రమాన్ని నిర్వహిస్తూనే ఉన్నది. కాని, ఆనాటి మలేరియా దెబ్బ, తన జీవితాంతం వరకూ ఆమెను బలహీనురాలిగా చేసింది. ఇంతేకాకుండా ఆమె సోదర సాధకులలో మంచివారు, ఒక్కొక్కరే మరణించడంతో ఆమె సన్నిహితులను కోల్పోసాగింది. అందులో మొదటిదెబ్బ తన గురుదేవుల మరణం. తర్వాత ఒక్కొక్కరే సహచరులు రాలిపోగా, తన గురుదేవుల కార్యనిర్వహణలో నివేదిత ఒంటరి అయినిలిచింది.

ప్రతినిత్యం ఆమె చెవులలో తన గురుదేవుల జీవిత సందేశం మరుమ్రోగుతూనే వుంది. ''రానున్న సంవత్సరాల వరకూ, మన ఏకైక లక్ష్యం భారతమాతను సేవించడమే ! తక్కిన చిల్లర దేవుళ్ళందరినీ తాత్కాలికంగా మనం మరచిపోవాలి. ఇక, మనకున్నది ఒకే ఒక్క దేవుడు. అది మన భారతజాతి, మానవజాతి! ఈ మానవజాతి అంతా ఆయన స్వరూపమే!! ఎక్కడ చూచినా ఆయన పాదాలూ,

ఎక్కడ చూచినా ఆయన శిరస్సులూ! ఎక్కడ చూచినా ఆయన చెవులూ, కళ్ళూ, ఆయన రూపాలే! ఈ మానవజాతి స్వరూపమైన ఆయనను మనం సేవించాలి. ఈయనే వేదాలలో వర్ణింపబడ్డ సహస్రశీర్షుడైన నారాయణుడు. ఇతడే మన దరిద్ర నారాయణుడు. సోదరి నివేదిత, ఈ పీడిత, దుఃఖిత దరిద్రులసేవనే భగవత్సేవగా తన జీవితాన్నంతా వ్యయం చేసి తనపేరును సార్థక మొనర్చుకొన్నది.

నివేదిత అమెరికాలో వుండగా ప్రపంచ ప్రఖ్యాతుడైన జ్యోతిష్కుడు ''కీరో'' (Cheiro) ఆమె చేయి చూచి, ఆమె 42 లేక 43వ సంవత్సరములకు మధ్య మరణిస్తుందని చెప్పిన విషయం ఆమెకు గుర్తువచ్చింది. స్వామి వివేకానందులు చికాగో వెళ్ళినపుడు ఈ జ్యోతిష్కుడు కీరో (Cheiro) స్వామి అరచేతిముద్రను (Hand print) తీసుకున్నాడు. అది ఈనాటికీ మనకు లభ్యమౌతుంది. ''కీరో'' మాటలు తలచుకొని 1904లో నివేదిత ఒక స్నేహితురాలుకు ఇలా వ్రాసింది. ''నాకిపుడు 36 ఏళ్ళు బహుశా నేను 1912లో మరణిస్తాను'' - అని :

తరువాత 1910 సంవత్సరంలో ఆమె తన డైరీలో ఇంకా ఇలా వ్రాసింది. ''నా జీవితంలో అద్భుతమైన ఈ 12 సంవత్సరాలూ, అయిపోవస్తున్నాయి. నవంబరులో 'మింటో' (Minto) పరిపాలన అంతంకాగానే నాజీవతంలో 'చరమాధ్యాయం' ప్రారంభమవుతంది బహుశా నేను ఇంక 2 సంవత్సరములు జీవిస్తాను''.



నవంబరు 1910లో సోదరి నివేదిత అమెరికాకు ప్రయాణమై వెళ్ళింది. తన ప్రియమైన స్నేహితురాలు 'మిసెస్ బుల్‌సతి' తీవ్రంగా జబ్బుపడింది. ఆమె జనవరి 1911లో మరణించింది. నివేదిత అక్కడనుండి ఇంగ్లండుకు వెళ్లి మార్చిలో ప్యారిస్ (Paris) చేరుకుని, ఏప్రిల్‌కల్లా భారతదేశానికి తిరిగివచ్చింది.

అది భారతదేశంలో మండిపోయే వేసవిగాడ్పులు చెలరేగేసమయం. ఆమె జగదీష్‌చంద్రబోస్ కుటుంబంతో ''మాయావతి'' ఆశ్రమానికి వెళ్లింది అక్కడ కొంతకాలం ఉండి, దేవీ నవరాత్రి పూజలకు వారు అక్టోబరులో ''డార్జిలింగ్'' వెళ్ళాలని నిర్ణయించుకున్నారు. క్రమక్రమంగా కాళీమాత పూజాదినాలూ, నవరాత్రిదినాలూ దగ్గరపడుతున్న కొద్ది సోదరి నివేదిత హృదయంలో ఒక విచిత్రమైన ఆరాటం, బెంగా గూడుకట్టుకోసాగాయి. రోజులు గడుస్తున్న కొద్దీ తనకు ''కలకత్తా చూడటం ఇదే ఆఖరి సారని'' ఆమె అంటూ వుండేది. తను ప్రేమించిన భారతదేశం, తన కలకత్తా తనకు మరింత ఆకర్షణగా కనిపించసాగింది.

బెంగా, ఆమె తన మిత్రులను, సోదరసాధకులనూ ఒక్కొక్కరి ఇళ్ళకూ వెళ్లి వాళ్ళతో కొంతకాలం గడపిరావటం ఆరంభించింది. బహుశా, ఆమె వారివద్ద శలవు తీసుకుంటున్నదేమో !

తను గాఢంగా ప్రేమించిన శారదామాత, ఆ సమయంలో కలకత్తాలో లేదు. స్వగ్రామమైన పుట్టింటిలో వుంది. అయితేనేం, తన

మాత ఎక్కడ లేదు? ప్రేమతో, భక్తితో సోదరి నివేదిత, కలకత్తాలోని శారదామాత నివసించే బసకు వెళ్లింది. ఆత్రంగా బాగ్‌బజారులోని ఆయింటిలో ప్రవేశించి శారాదామాతకు మనస్సులోనే నమస్కరించింది. అక్కడ వున్న వృద్ధులైన సాధకులనూ, పెద్దలనూ, ప్రేమతో పలకరించి సెలవు తీసుకొన్నది. చివరికి శ్రీ రామకృష్ణుని సేవించిన వృద్ధురాలైన ''జోగిన్‌మాత''ను దర్శించింది.

పండు ముసలిదైన 'జోగిన్‌మాత' సోదరి నివేదితను ప్రేమతో, ఆపేక్షతో దగ్గరకు తీసుకుంది. క్రిందకు వంగి జోగిన్‌మాత యొక్క పాదధూళిని తీసుకుంటూ సోదరి నివేదిత మృదుస్వరంతో నెమ్మదిగా అన్నది. ''జోగిన్‌మా ! నేను ఇక తిరిగిరాను. బహుశా ఇది నా తుది వీడ్కోలు''. ''ఛా! అవేం మాటలు నివేదిత! ఏమిటిది?'' అంటూ ఆమె తన బిడ్డవంటి సోదరి నివేదితను ఆవేదనతో చూస్తూ తలనిమిరి ప్రశ్నించింది జోగిన్‌మాత

''ఎందకో చెప్పలేను. కాని, ఇదే నా చివరిదర్శనం అనిపిస్తున్నది. ఇంక మళ్ళీ మిమ్మల్ని చూడలేను''.

జోగిన్‌మా ''అలాంటి పిచ్చి పిచ్చి సందేహాలను నీ మనస్సులోంచి దూరం చేయమని'' మందలించింది. అయినా ఆమెకు లోపల దిగులుగానే ఉన్నా, పైకి నిబ్బరంగా ఉన్నది.

అక్కడనుంచి నివేదిత 'బోస్ కుంటుంబం'తో కలసి డార్జిలింగ్



వెళ్ళింది. మొదట కొద్దిరోజులు, ప్రశాంతంగా గడిచిపోయాయి. ఒకరోజు దూరంగా వున్న ''సాండక్ ఫూ'' (Sandak Fu) అనే పర్వత శిఖరాన్ని ఎక్కాలని నిర్ణయించుకున్నారు. కాని బయలుదేరవలసిన రోజున నివేదితకు రక్తవిరోచనాలు ఆరంభమయినాయి.

హడావిడిగా అక్కడున్న వైద్యులను పిలిపించారు వారు బలమైన మందులతో చికిత్స చేయసాగారు. కాని గుణం కనిపించలేదు. మంచంలో పడుకున్న సోదరి నివేదిత తన జీవితయాత్ర చివరి మజిలీ చేరుకుంటున్నది అని భారతమాతకు సేవచేసే జీవితకాలం అయిపోవస్తున్నదనీ విచారించింది.

ఇటు అందరూ ఆందోళన పడసాగారు. వ్యాధి గంట గంటకూ ఎక్కువకాసాగింది. గంట గంటకూ మరింత రక్తం పోసాగింది కాని సోదరి నివేదిత నీరసంగా నవ్వుతూ అందరినీ తన ప్రక్కవద్దకు పిలిచి ఉత్సాహపరుస్తూ మాట్లాడింది. తన గురుదేవుల పవిత్ర కార్యక్రమం ఆగకుండా సాగిపోవాలనీ, ఆయన పని ఎప్పటికీ ఆగరాదు, తను ఒక్కతే మరణించినంత మాత్రన ఏమిలోటు, తన భారతమాతకు? ధైర్యంగా కార్యాన్ని కొనసాగించమని అందరికీ చెప్పసాగింది. వారందరూ మరింత దిగులు పడసాగారు. చివరి వరకూ ఆమె చిరునవ్వుతోనే ఉంది.

ఆరోజు అక్టోబరు 7వ తారీకు. ఆమె తనవీలునామా వ్రాయించింది. ''తను నిరంతర శ్రమతో వ్రాసిన గ్రంధాలూ వాటిమీద తనకు వచ్చిన ఆదాయం అంతా, స్వామి వివేకానందుని బేలూరు

మంతానికి రాసియిచ్చింది. బ్యాంకులోని తనకొద్ది ధనాన్ని తను ఏర్పాటుచేసిన ''బాలికా పాఠశాల''కు విరాళంగా వ్రాసి ఇచ్చింది. భారత విద్యావిధానం బోధించడానికి తన వస్తువులన్నీ స్నేహితులకూ, మిత్రులకూ ఇచ్చేసింది. ఒక్క జపమాల మాత్రం తనవద్ద మిగిలింది సమీపిస్తున్న మృత్యువును ప్రశాంతంగా చిరునవ్వుతో, సంతృప్తిగా ఆహ్వానిస్తూ కళ్ళుమూసుకొని, చిరకాలంగా తన గురుదేవుల వద్ద నేర్చుకొన్న యోగాభ్యాసంవల్ల గాఢమైన ధ్యాన సమాధిలోకి వెళ్లిపోసాగింది. అక్కడున్న రామకృష్ణ సన్యాసులు తన ప్రియమైన వేదమంత్రాలలో, త్యాగమూర్తి అయిన రుద్రసూక్తాలు చదవమని కోరింది. బహుశః శివుని అవతారంగా, జీవించిన తన గురుదేవులు గుర్తుకు వచ్చారని ఏమో ?

గది అన్నివైపులా, ప్రశాంత వాతావరణం అలుముకోసాగింది. ఎదురుగా ఒకదీపం శెమ్మాలో అఖండ జ్యోతి వెలుగుతూ వున్నది. వేదమంత్రాలు పూర్తి అయినాయి, బ్రాహ్మణుల కంఠంనుంచి ప్రశాంత స్వరంతో ఈ మంత్రాలు వినవస్తున్నాయి.

''అసతో - మా సద్గమయ !''

''తమ సోమా, జ్యోతిర్గమయ !''

''మృత్యోర్మా - అమృతం - గమయ !''

మమ్ములను అసత్యంనుండి, శాశ్వత సత్యానికి నడిపించుకు వెళ్ళు. ఓ అఖండ జ్యోతి ! మృత్యువు నుంచి మమ్ము అమృతత్వానికి చేర్చు!

చివరికి మెల్లిగా మంత్రాలు ప్రశాంతతలో కలిసిపోయాయి. నీరసంగా నవ్వుతూ, కొంచెం తలెత్తి ''నా చిన్ని పడవ మునిగిపోతున్నది, నా ప్రయాణం పూర్తిఅయింది. కాని ఎదుట సూర్యోదయం! అదుగో!'' అంటూనే, తల అకస్మాత్తుగా తలగడపై పడింది. శరీరం ప్రక్కకు వ్రాలింది.

ఆరోజు అక్టోబర్ 13వ తేదీ. సోదరి నివేదిత ఆత్మ అనంత వాయువుల్లో కలిసిపోయింది. ఒక్కసారి దేశమంతా వార్త గుప్పుమన్నది. నిరంతర త్యాగమూర్తి అయిన సోదరి నివేదిత, భారతీయులకు స్నేహితురాలు అయిన సోదరి నివేదిత, ఇకలేదు అన్న విషయం గుర్తుకు రాగానే తండోపతండాలుగా జనం వీధుల్లో గుమిగూడి, శోకంతో చీమల బారులాగా కదలసాగింది.

అలా చీమల బారులా వేలాదిమంది ఆమె శరీరాన్ని అనుసరించి కదలివెళ్ళారు. కడసారి వీడ్కోలుగా రుద్రభూమికి అనుసరించి వెళ్ళారు.

ఆనాటి ఆమె అంతిమయాత్రకు, యావద్భారతదేశం సాగనంపడానికి వెళ్ళిందా అన్నట్లనిపించింది. సోదరి నివేదిత తాను జీవితమంతా ప్రేమించిన భారతమాత ఒడిలో విశ్రాంతి తీసుకోడానికి వెళ్లింది. ఆమె శరీరం మాత్రం దహనంచేయబడింది.

ఆమె నిస్వార్థజీవితానికి చిహ్నంగా అతినిరాడంబరంగా ఎర్రటి

ఇటుకలతో కట్టబడిన ఆ సమాధి, ఇప్పటికీ డార్జిలింగ్ రైల్వేస్టేషన్ దగ్గర మనకు కనబడుతూనే వుంటుంది. ఆమెకు మృత్యువు లేదు! మనలో నివేదిత, నిత్యం భారతమాతరక్తంలో నిలిచి జీవిస్తూనే వుంటుంది. ''సోదరి నివేదిత భారతమాతకు ముద్దుబిడ్డ, స్వామి వివేకానందుల ప్రియ శిష్యురాలు. ఇవే ఆమెకు ఇష్టమైన మాటలు! ఆమె హృదయంలో దాచుకొన్న స్మృతి[illegible]లు! అవే ఆమెకు సమాధిమీద వ్రాయవలసిన ప్రేమ మాటలు !!!





# USCEFI — యుస్కెఫీ

## అంటే ఏమిటి?

మనది భారతదేశం ! ప్రపంచంలో మన భారతీయులకు మనది అంటూ ఒక ప్రత్యేకసంస్కృతి వుంది! మన సంస్కృతి గురించి మనం తెలుసుకోవాలంటే — ప్రతి భారతీయుడూ — మన జాతిగురించీ మన దేశంగురించీ, శాస్త్రాలగురించీ సరైన విజ్ఞానం ఇచ్చే ఇలాంటి అమూల్య గ్రంధాలు చదివితీరాలి!

## మూలక్ష్యం

భారతదేశమన్నా, భారతీయ సంస్కృతి అన్నా, కళలూ, మన జాతీయ సాహిత్యం అన్నా, ప్రజలలో గౌరవం, భక్తి ఇనుమడింప చేయటమే, ఈ **''భారతీయసంస్కృతిసముద్ధరణ సంస్థ''** - లేక **USCEFI** యుస్కెఫీ లక్ష్యం. **USCEFI** - అన్న అక్షరాలు **"United Social Cultural & Educational Foundation of India"** అన్న ధర్మసంస్థ పేరు. సంక్షిప్తంగా దీన్నే మామూలుగా **''యుస్కెఫీ''** లేక **''భారతీయ ఆధ్యాత్మిక సాంఘిక సాంస్కృతిక విద్యా సముద్ధరణ''** సంస్థ అని తెలుగులో.